


సంపుటి 15 :: డిసెంబరు 59' :: సంచిక 12



# క్షమార్పణ

జనవరి 14 నాటికి ఆంధ్ర మహిళ పదహారవ వార్షిక సంచిక తీసుకుని రావాలన్న దృష్టితో యీ మాసం "ఆంధ్ర మహిళ" చిన్నదిగా వేస్తున్నాం. ఇందుకు పాఠకులూ అభిమానులూ మన్నిస్తారని తలుస్తాము.

ఆంధ్ర మహిళ పదహారు సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా వస్తూంది. వేలాది పాఠకులున్నారని ఘనంగా చెప్పుకోలేక పోయినా ఆంధ్ర మహిళ అభిమానుల సంఖ్య యితోధికంగా పెరుగుతూనే వస్తూంది.

నేడు పత్రికలు వాటిని నడపడం అన్నది పెద్ద సమస్యగా తయారైంది, దిట్టమైన ఆర్థిక స్తోమతు వుంటేనే గాని పత్రికను సర్వాంగ సుందరంగా చేయడం అన్నది అసంభవం అలా వున్ననాడు పూర్తిగా వ్యాపార దృక్పథం వచ్చేస్తుంది- తప్ప సారస్వతపు విలువలు పెంపొందించే ప్రయత్నంగాని, ఏదో యితోధిక సాంఘిక సేవా కార్యక్రమాలని ప్రచారం చేద్దామని గాని తోచదు. అలా తోచక పోవడం సహజమే కూడా పత్రిక స్వంత కాళ్లమీద నిలబడాలంటే పూర్తిగా వ్యాపార దృక్పథం అవసరమే.

కాని పలుముఖ కృషి చిహ్నగా యిన్నాళ్ళు రూపొందింది. యికమీదట కూడా అలాగే వుంటుందని మా నమ్మిక. స్త్రీలలో సారస్వత అభిలాషను కుతూహలాన్ని పెంపొందించాలని ప్రయత్నం, పలువురికి దేశం నాల్గు చెరగులా జరుగుతున్న సాంఘిక సేవా కార్యక్రమాల వివరాలు విలువలు తెలియ చెప్పాలన్న కుతూహలం అన్నీ ఆంధ్ర మహిళకి వున్నాయి. వాటి కృషి ఫలితం పాఠకుల మూలకంగా విశదం అవుతూనే వుంటుంది. పదహారవ వార్షిక సంచికని కూడా అందరూ ఆదరిస్తారని ఆశిస్తాము.

★

## వచ్చేదే వార్షిక సంచిక!



# ఆంధ్ర మహిళ

**16** వ. వార్షిక సంచిక

సంక్రాంతి నాడు వెలువడుతుంది

చక్కటి ముఖ చిత్రం
ఎక్కువ పేజీలు

ప్రముఖుల రచనలు
ప్రత్యేక ఆకర్షణలు

వివరాలకు :

ఎడిటర్, 7 ఎ. రోజరీచర్చిరోడ్డు
మద్రాసు 4.




# బ్రతికి బాగుంటే ....

"నమస్కారము"

"నమస్కారాలు"

"బహుకాల దర్శనము"

"మరచిపోలేముకదా? ఎప్పుడు వచ్చారు?"

"మరచిపోతే ఎందుకువస్తాము. రెండు నెలలైంది"

"రెండు నెలలా? ఇంట్లో అందరు కులాసానా?"

"మరి ఆబిడను తీసుకురాలేదేమి?"

"నాలుగైదు నెలలనుండీ ఆరోగ్యము సరిగాలేదు. ప్రదేశమార్పు కోసమే ఇక్కడకు తీసుకు వచ్చాను"

"ఆసంగతి తెలియలేదే తెలిస్తే వచ్చిచూచేదానిని"

"చూడకూడదనే తెలుపలేదు,"

"ఆ! చూడకూడదనే తెలుపలేదా?! ఏమి ప్రమాదకరముగా నుండినదా?"

ప్రాణాపాయ కరమేమీలేదు. కాని మానసికముగా ప్రమాదపరిస్థితిలో యుండుటచేత ఆమెను ఏకాంతముగానే వుంచి శ్రద్ధ తీసుకొనుచున్నాను."

"ఓహో! అదా అర్థమయింది. మీరు ఆమె విషయములో చాలా శ్రద్ధ తీసుకున్నారు. చాలామంది నిర్లక్ష్యముగా వుంటారు,"

"అది నిర్లక్ష్యముకాదు. మీరట్లా, అపోహ పడతారు. చాలామంది మగవారికది తెలియదు, ఈ ఘట్టములో ప్రతిభర్త ఏదోకొంత క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొన వలసివస్తుంది. అది భార్య శారీరక మానసిక సంభవమైన మార్పువల్ల కలుగుచున్నదని తెలియదు. ఆమె చేష్టలు అర్థము చేసుకొనలేక, ఏమోనని భ్రమించి, అతిశయ గర్వోద్రేకములతో పోట్లాడే భర్తలు కూడా వున్నారు. ఈ ఘట్టములోని పరిస్థితులు ఎదుర్కొనటానికి నేను విశేషశ్రమచేసి ఐదారు ఏండ్లనాడే ఆవిషయమును సాంగోపాంగముగా తెలుసుకొనుటకు అనేక పుస్తకములు చదివి ఆ పరిస్థితి వచ్చినప్పుడు ఎదుర్కొనుటకు సంసిద్ధుడనై వుంటిని"

"అలాగా అందరికీ తెలియదంటే నేను వప్పుకోను తెలిసే, తెలియనట్లు నటించుతారంటే. అయితే మీకు శారీరక మానసిక శాస్త్ర పుస్తకములు ఆమూలాగ్రముగా చదివితిరా?"

"అవును విదేశ రచయితలు వ్రాసిన మానసిక శాస్త్రముల పుస్తకములు చదివి దానిలోని విషయములు మనశాస్త్ర పురాణములలోని వాటికి అన్వయించు కొంటిమి."

"మీరీ విధముగా చదువుటకు కారణ మేమిటీ? భర్తలందరూ చదువుతారా?"

"జాగ్రత్తగలవారెల్ల చదువుదురు మీరిదివరలో ఈ విషయమున కొన్ని వ్యాసములు చక్కగా వ్రాసి యుంటిరి కదా? కారణ మేమిటని అడుగనేల. పురు

# ప్రయత్నే ఫలి

ఆధునిక వ్యవసాయ విధానాలలో ప్రబలమైన విశ్వాసం వుంది, ఎదురొడ్డి నిలబడి వాటిని ఆచరణలో గనక పెడితే. ఫలితాలు ప్రశంసనీయంగా ఉండగలవనడంలో సందేహంలేదు ఎన్నో సందర్భాలలో. అనేకమంది రైతులు యీ సత్యాన్ని నిరూపించారు. దేశంలోని వేర్వేరు ప్రాంతాలకు చెందిన ముగ్గురు రైతుల విజయగాథ ఇది.

హార్భన్స్ లాల్ గుప్త. అసలు మొదట పట్టణవాసి, అతను ఒక చిన్న పరిశ్రమను ఏర్పాటు చేసుకురావాని మొదట ఉబలాట పడ్డాడుగాని దరిమిలాను వ్యవసాయంలోకి దిగాడు, ఇతర రంగాలలో కంటే ఆహార రంగంలోనే కృషి ఎక్కువ అవసరమనీ, దానిలోనే తన సేవ చూపించాలనీ అతను తలపోశాడు.

పంజాబు రాష్ట్రంలో అమృత్‌సర్ జిల్లాలో తరన్ తరన్‌కు 6 మైళ్ళలో ఉన్న బాలబాక్ గ్రామంలో ఫాక్టరీని కట్టాలనే ఉద్దేశంలో గుప్త బంజరునేల చెక్క ఒకటి కొన్నాడు కాని పైన చెప్పినట్లు అతడు తరువాత మనసు మార్చుకున్నాడు. తాను కొన్న 50 ఎకరాల నేలలో హానికరమైన లవణాలు అధికంగా ఉండడంవల్ల అక్కడ పూచిక పుల్లయినా పండదని అతనికి తెలుసు, కాని అతను నిరుత్సాహ పడలేదు. బ్లాకు ఆఫీసర్ల వద్దకు వెళ్ళి సలహా అడిగాడు. ఉచితంగా సలహాయేగాక కొంత ఆర్థిక సహాయంకూడా వారు అందచేశారు

ఆ డబ్బు పెట్టి అతను ఒక గొట్టపుబావి తీయించాడు, సాగునీటి సమస్య యీ విధంగా తీరిపోవగానే గుప్త బ్లాకు ఆఫీసర్ల సలహా ప్రకారం మాగబెట్టిన కంపోస్టు ఎరువు సత్రజని పొటాషియం, భాస్వరం ఎరువులు తగు నిష్పత్తిలో కలిపి పొలంలో వాటిని చల్లారు. దీనికితోడు జనుము, క్లోవరులనే పచ్చి ఎరువు పండించి, అవి పచ్చిగా ఉండగానే వాటిని నాగలితో దున్నించి మట్టిలోకి తొక్కించారు కుళ్ళిపోతున్న యీ పచ్చి ఎరువు నేలలోని లవణాలను పీల్చి వాటివల్ల కలిగేహానికరమైన ఫలితాలను నివారిస్తుంది.

అప్పుడు పొలానికి నీళ్లుపెట్టి నేలను కొద్ది అంగుళాల లోతుకు తవ్వి మట్టిని పైపైన గోకి వేశారు. ఈ విధంగా లవణాలతో కూడిన పై మట్టిని త్రవ్వి తీసి వేసి, పొరుగున ఉన్న పంటకాల్వలనుంచి ట్రాక్టరుతో సారవంతమైన ఒండ్రు మట్టిని టన్నులకొద్ది తెచ్చి పొలంలో చల్లారు.

ఇలా 1954 లో గుప్త ప్రారంభించిన భగీరథ ప్రయత్నం ఫలప్రదమై ఆ బంజరు భూమి బంగారు పండే సుక్షేత్రంగా తయారయింది. అందులో అతను వరేకాదు చెరుకు, కూడా వేశాడు. వరి, చెరుకు ఇవి రెండు కూడా లవణాల వల్ల దెబ్బతినవు. ఈ కీలకం తెలుసుకొనే ఆతనీపంటలు పండిస్తున్నాడు. ఈ సాగు యీ వ్యవసాయ క్షేత్రంలో ఎకరానికి 54 మణుగుల వరి ఎకరానికి 1000 మణుగుల చెరుకు పండుతోంది.

అధునిక వ్యవసాయ విధానాలను అవలంబించి అపారంగా లాభాలు తీస్తున్న మరో రైతు చౌదరీ మామ్‌చంద్, ఇతను ఢిల్లీలోని నజఫ్‌గడ్ బ్లాకులో ఉన్న మిత్రాల గ్రామ కాపురస్తుడు.

మామ్‌చంద్ అవలంభించే పద్ధతులు చాలా సులువైనవి డిస్కు నాగలితో అతను పొలాన్ని 10, 12 సార్లు దున్నుతాడు 3 అడుగులు ఎడం ఎడంగా అతను గోతులు తవ్వి ఎకరానికి 35 బళ్ళ చొప్పున కంపోస్టు ఎరువు వేయించాడు, ఆ తర్వాత మూడు నెలలకు ఎకరానికి 1 మణుగు చొప్పున సూపర్ చల్లి మట్టిలో బాగా కలిసి పోయేటట్లు చేశాడు అటు పిమ్మట మేలిరకం విత్తపు కలుపులకు చాళ్ళలో 4 అంగుళాల లోతున వరుసగా పోశాడు, ఎకరంలో యీ విధంగా 30 వేల కలుపులను నాటకం జరిగింది. త్వరలో మొలకలెత్తటానికి వీలుగా వాటిని నీళ్ళలో ముందు కొంతసేపు నానబెట్టి ఉంచాడు,

ఈ విధంగా కణుపులను నాటిన నెల రోజులకు పొలానికి నీళ్ళు పెట్టాడు. ఎకరానికి రెండున్నర మణుగుల చొప్పున అమ్మోనియం సల్ఫేటు చల్లాడు. ఆ తర్వాత 20 లేక 22 రోజుల కొకసారి చొప్పున 15, 16 సార్లు నీళ్ళు పెట్టారు. పంట ఏపుగా నిటారుగా యెదగడానికి తగు వసతులు చేశాడు.

మామ్‌చంద్ 31৭ రకం చెరుకు వేశాడు. ఢిల్లీ పరిసరాలలో యీ రకం చెరుకు పెంచి మంచి తీయని బెల్లం కూడా తీయవచ్చు మామ్‌చంద్ నిరుడు నాలు

గంటే నాలుగు ఎకరాలలో పంటవేసి రూ. 3.200 నికరాదాయం సంపాదించాడు.

మూడవ రైతు ఒక తోట యజమాని. ఇతను మద్రాసు రాష్ట్రం మధురై జిల్లా కామాయ గౌంకస్పద్ది గ్రామస్థుడు. పళనివేలు ఇతను ఒక ఎకరంలో దాతు వేసి ఏటేటా సుమారు 2000 లాభం చేస్తున్నారు అతను చేసే కిటుకల్లా ఒకటే. తోటకు బాగా ఎరువు తోలడం. కొమ్మలు కత్తిరించడానికి 20 రోజులు ముందు, పశువుల డెక్కలు కొమ్ములపొడి 224 పౌన్ల వరకు చల్లుతారు. కొమ్మలు కత్తిరించిన తర్వాత 4 బళ్ళ గొర్రె పెంట తోలుతారు. ఏడాదికి రెండుసార్లు కొమ్మలు కత్తిరిస్తారు. తెగుళ్ళుతగలకుండా కొమ్మలు కత్తిరించిన వెంటనే, దాతు మొక్కలపై డి. డి. టి. చల్లుతారు. ఆకు తెగుళ్ళకు అదికట్టడానికి అవసరమైనప్పుడల్లా బోర్డు మిక్చర్ కూడా ఉపయోగిస్తారు.

మరో విశేషం ఏమంటే పళనివేలు తన తోటకు నాలుగు భాగాలుగా విభజించి ఒకదాని తర్వాత ఒకటి వేర్వేరు ఋతువులలో పళ్ళు కాసేటట్టు, ఒక మడి విడిచి ఇంకో మడిలో మొక్కల కొమ్మలు కత్తిరిస్తూ ఉంటాడు. అంటే దీపివల్ల అతి వర్షాదుల వల్లో లేక ఇతర కారణాదులవల్లో చెదురు వాటిగా ఏ మడిలోనైనా పంట దెబ్బతిన్నా. మొత్తంమీద ప్రతి ఏటా ఎంతో కొంత పంట దిగుబడి అయ్యే అవకాశము ఉంటుంది. తోట మొత్తం మీద పంట దెబ్బతినిపోయే ప్రమాదం ఉండదు ఆదీగాక ఏడాది పొడుగునా పంట పండించడంలో మరో లాభం ఉంది. విదపకాలపు పంటకు గిరాకీ ఎక్కువ ఉండి డబ్బుకూడా ఎక్కువ వస్తుంది.

పళనివేలుకు వ్యాపారంలోని సులుపు బలువులు క్షుణ్ణంగా తెలుసు. ముఖ్యంగా కిస్మస్ రకమే పండిస్తాడు. ఈ రకం స్వదేశంలో యెక్కువ దొరకదు. విదేశాలనుంచి దిగుమతి చేసుకొంటున్నారు. అందువల్ల దీనికి దేశంలో గిరాకి ఎక్కువ. పంటకు ధరా ఎక్కువ.

# తెలియని అనుబంధం

కథానిక

దాదాపు ఆరు సంవత్సరాల తరువాత ఆ రైల్వే స్టేషనులో రైలు దిగుతూ, బెడ్డింగు చేతిలో పట్టుకొని కాలు పెట్టానో లేదో ప్రక్క ఫస్టుక్లాసు పెట్టె నుండి "అన్నయ్య" అనే పిల్పువిన్నా. అయినా నన్ను అంత అప్యాయంగా యిచ్చట పిల్చేవారు ఎవరుంటారులే అనుకొని సూటుకేసు దించుకొంటూ యుండగా మరల "అన్నయ్యా.అన్నయ్యా" అని ఎంతో ఆత్రుతగా పట్టలేని సంతోషావేశాలతో పిల్వటంవిని ప్రక్కకు చూద్దును గదా లలిత నవ్వుముఖంతో తయారు: తన భర్తని, కొడుకుని, కూతురుని, పరిచయం చేయటం. తను తనచెల్లెలు పెండ్లికి వెళ్ళుతున్నట్లు, నన్నుకూడ రమ్మని ఆహ్వానించటం. నన్నుగూర్చి లక్ష యక్షప్రశ్నలు. నా సమాధానానికి ఎదురుచూడ కుండా. అది తన పని కాదనట్లుగా. వెంటవెంటనే అడగటం, ఉత్తరం వ్రాయమని కోరటం, రైలు కదల బోతూ యుండగా, నవ్వుతూ యున్న మేమిద్దరం కన్నీళ్ళ పర్యంతం అవటం అన్ని అయిదు నిముషాలలో జరిగిపోయాయి.

లలితమ నేనుచూసి దాదాపు ఆరు సంవత్సరాల పైనవుతుంది. ఆమెకు నాకు పరిచయం అల్లా ఒక్క రెండు నెలలు మాత్రమే. మేము కలవటంకూడ, చాల గమ్మత్తుగానే కలిసాము. లలిత తన పరీక్షల తరువాత ఆ సంవత్సరం పరీక్ష తప్పిందికూడాను. ఫలితాలు తెల్సినప్పుడు పాపం రోజంతా ఏడుస్తూనేవుంది. శెలవులకు వాళ్ళ పెద్దమ్మగారి యింటికి వచ్చింది. కొన్నికారణాలవల్ల నేనుకూడ రెండు నెలలు అచ్చటనే గడపటం జరిగింది. ఆ రోజులలోకూడ యిలా దేశ దిమ్మరిగా, నాది అనేది లేకుండా. నాకొరకు బాధపడేవాళ్ళుకూడా లేకుండా తిరుగాలని. విహంగంలా విహరించాలని, పరుగెత్తె మబ్బుల్లా ప్రపంచాన్ని చుట్టిరావాలని, విపరీతంగా పుస్తకాలుకూడ చదవాలని కోరుకుంటూ- ఊహాగానంలో విహరిస్తూ యుండేవాడిని. ఆనాటి కోరికలు, యింత నమ్మలేనంత సత్యంగా తయారవుతాయని, నేనెన్నడూ కలలోకూడ అనుకొనలేదు.

లలితకు భోజనం చేయటం ప్రతిసారి ఒక గండంగా యుండేది. వాళ్ళ పెద్దమ్మగారు దగ్గర కూర్చొని ఎంతో ప్రేమానురాగాలతో, చిన్నపిల్లలకు పెట్టిస్తున్నట్లు పెట్టించేది. షావుకారుగారి ఏకైక పుత్రికారత్నం. వల్లమాలిని గారాబం. అందులో పట్టణంలో చదువు కొంటూ యుండేదా, సన్నగా యీ కాలపు నవ నాగరికత యువతిగా, గాలివస్తే తూలిపోయేటట్లు, అతి నాజూకుగా యుండా లనుకొంటూ యుండేదనుకొంటా. నిజానికి వంటమనిషి వద్దంటూ చెలుగుతూ యున్నప్పటికి, కొద్దిగా అన్నం పెట్టినప్పుడు చూడాలి లలితాదేవిగారి ముఖం. ఎంతో పట్టరానికోపంతో మునగతీసుకొనియుండేది, కాదంటే చేసేది లేక కళ్ళనీళ్ళు పెట్టేది. ఆ కాసేపు ఎవరితోను మాట్లాడేది గాదు. కాని మేమిద్దరం మట్టుకు సరదాగా కల్సిమెల్సి యుండేవాళ్ళం ఆటలు, పాటలు, షికార్లతో కాలం ఎంతో ఆనందంగా. తొందరతొందరగా, గడచిపోయింది నాజీవితం అలాగడపటం. అదే అఖరుసారి,

"అన్నయ్య అన్నయ్యా" అంటూ ఎంతోఅప్యాయంగా పిలుస్తూయుండేది. నేను"అక్కయ్యఅక్కయ్యా" అంటూ నవ్వుతూయుండేవాడిని. ఎవరిమీద కోపం వచ్చినా లలితకు నామీద మట్టుకు ఎప్పుడూ కోపం వచ్చేదిగాదు.

శ్రీమతి పద్మావతిగంగాధర్

నన్ను ఎవరైనా ఏదైనా అనటం జరిగితే, నా కొరకు వాళ్ళందరితోను పోట్లాడుతూ యుండేది. లలితను చూడ టానికి అనేకమంది స్నేహితులు, చదువుకొంటున్న కల వారి అమ్మాయిలు ఎందరో వస్తూ పోతూ యుండేవారు. లలితను ఉడికిలించటానికి, వాళ్ళు ఏదో ఒకటి నన్ను అనేవారు అంతే లలితకు కోపం రావటం, పోట్లాడు కోవటం కొంత సేపు బిగతీసుకొని పోవటం, వాళ్ళు కిల కిలా నవ్వటం. సామాన్యంగా తరచుగా జరుగుతూనే యుండేది ఏమిటో యీ అనుబంధ సంబంధం, అంతస్థు లలోకూడ మాకు అంతులేని అఘాతం ఉంధి ఆమెతో "అన్నయ్యా"అని అనిపించుకొనటానికి తగిన యోగ్యత అర్హతా నావద్ద ఏమీలేదు

ఆటలలో నయినా ఓడిపోవటం అంటే లలితకు ఎంతో కష్టంగా యుండేవి ఎవరైనా అన్యాయం చేసి నప్పుడు నేను నవ్వుతూయుంటే. తను కోపంతో మండి పోతూండేది

"లలితా యిలా అయితే వచ్చే మహానుభావుడు భస్మం కావాల్సినదే అదృష్టవంతుడు, నిప్పులపూజ చేస్తూ వుంటాడు" అంటూ ఉండేనాడిని

"నేను అసలు పెళ్ళి చేసుకొంటేగా" అని టకీ మని సమాధానం యిచ్చేది.

"మరి ఏమి చేస్తావు లలితా?"

"మఠంలో చేరుతా"

"మరి నీ ఆస్తి అంతానో"

"మఠానికే వ్రాసియిచ్చి, కృష్ణా, రామా, అని అను కొంటూ వుంటేపోదూ?"

"ఎవరికో ఎందుకు, నాకే వ్రాసి యివ్వగూడదు లలిత నీకు పుణ్యంకూడ వస్తుంది. అయినా నా పిచ్చిగాకపోతే నీలాంటి షావుకారుగారి అమ్మాయికి, అలాంటి అవసరం ఏముంటుందలే"

"కావలిస్తే యిప్పుడే వ్రాయించుకో అన్నయ్యా" అంటూ పక్కున నవ్వేది.

నాకు పిల్లలు పుడితే, నా కూతురుని తీసుకెళ్ళి పెంచి, చదువు చెప్పించి. పెద్దదానినిచేసి పెళ్ళి చేస్తానంటూ వుండేది యిలా రెండు నెలలు ఎన్నో మరువలేని విష యానాతో కలగా గడచిపోయినాయి.

అనాటి తరువాత యిదేమరల మొదటిసారిగా లలితను చూడటం సన్యాసిగా వుంటాననేలలిత, పిల్లలతో. సంసా రంతో, కల, కలలాడుతూ వుంది

లలితకు వాళ్ళనాన్నగారి అడ్రసుకు ఉత్తరం వ్రాయాలి

ఏమనివ్రాయాలి?

నాదేశదిమ్మరి తనాన్నిగూర్చి వ్రాయాలా?

నేను చూసిన, నాకు జరిగిన అక్రమ అన్యాయాలను గూర్చి వ్రాయాలా?

మా అమ్మాయిని పెంచుకొని చదువు చెప్పించమని అడగాలా?

ఏమని వ్రాయాలి?

నిజంగా లలితకు తప్పక ఉత్తరంవ్రాయాలి కన్నవారి కన్నా ఎక్కువ ప్రేమగాయుండేవి నేనంటె. "ఎప్పుడు డబ్బుకావల్సి వచ్చినా. మరే అవుసరంవున్నా నాకుగాని, నాన్నకుగాని, వ్రాయి అన్నయ్యా" అంటూ నేను అలాగే చేస్తానని, చేతిలో చేయి వేయించుకొన్నది లలిత తన స్నేహితురాళ్ళలో ఒకరికి నేనంటే వల్లమాలిన ప్రేమని. నన్ను తప్పక ఆ అమ్మాయిని చేసుకొనమని ఎంతో బలవంతం చేస్తూ ఒకటి రెండు ఉత్తరాలుకూడ వ్రాసింది లలిత. యీ ఆరు సంవత్సరాలలో ఎంతగా మారిపో యింది వాళ్ళ చెల్లెలు పెళ్ళికి కెదితేనో? వాళ్ళ అందరిని కల్సుకొన్నట్లుంటుంది. వాళ్ళ నాన్నగారు కూడ చాల సంతోషిస్తారు ......

"బాబూ యీ సామాను తమదేనా? బయటకు తీసు కొని వెళ్ళమంటారా?" అన్న కూలివాని ప్రశ్న నా ఆలో చనలకు అడ్డువచ్చింది. చూద్దునుగదా ఆ ప్లాటుఫారం మీద ఎవరూలేరు. అందరిని సాగనంపి నన్నుకూడసాగ నంపటానికి వచ్చాడు యీ కూలి ఎంత మంచివాడు. అంతమంచి, అమాయకపు లలితకుకూడ అంతకోపం. అదియిప్పటికి కూడ యున్నదేమో? ననుకుంటూ ఆ కోపపు కోమలి ముఖం గుర్తుకువచ్చి నవ్వుతూ. సాగ నంప తయారుగావున్న కూలివంక చూసాను






వ్యవస్థాపకురాలు.

శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్

# ఆంధ్ర మహిళ

## 16 వ వార్షిక సంచిక

## ప్రకటనల వివరాలు

(ఒకేరంగు – ఒకసారికి)

| | |
|---|---|
| నాల్గవ కవరు | 60 రూ |
| లోపలి పేజీ | 50 రూ |
| అర్ధపేజీ | 30 రూ |
| పావుపేజీ | 20 రూ |

**ఆంధ్ర మహిళలో**

ప్రకటన అంటే

విస్తారమైన ప్రచారము!

విలువైన సేవాకార్యము!

**సాలుచందా 6 రూ**

వివరాలకు :

మేనేజరు, 7 ఎ. రోజరీచర్చిరోడ్డు, మద్రాసు 4.

# అసమర్థుడు

కె. సారధి

సుధ బ్రతికినన్నాళ్ళు, నేనొక్కసారి కూడ ఆమెను సంతోషపెట్ట లేకపోయా. కేవలం అజ్ఞానంలో పడి. పశువుగా ప్రవర్తించి, నా వెలలేని మాణిక్యాన్ని పోగొట్టుకొన్నా. "చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నట్లు, నా సుధ నన్నిడిచి పెట్టివెళ్ళిన పిమ్మట, వగచి ప్రయోజనం" పరిస్థితుల ప్రభావానికి చా సుధ ఆహుతయి పోయింది.

సుధకు నాకు వివాహామై రెండు సంవత్సరాలు కావస్తుంది. మొదట ఈ పెండ్లికి నేనొప్పుకోలేదు. కారణం అప్పుడే కాలేజీ చదువు ముగించి, వుద్యోగ ప్రయత్నంలో వున్నా. నా క్లాసుమేటు ఉషను వివాహం చేసుకొందామని పించింది. ఆమె కూడ అదే అభిప్రాయంతో వున్నట్లు నాకు తెలియక పోలేదు. మా కలియికతో ఈ విషయం అనేక మార్లు కొట్టుపడింది. ఆమె తన కభ్యంతరం లేదని, కాని తన తండ్రి ఈ సంబంధానికి ఏనాడు సమ్మతించ డని చెప్పేసింది. నేనేమి అంతగా వున్నవాణ్ణి కాను, ఉష నాన్నకు, నాకు ఈ విషయనపై భేదాభిప్రాయ లేర్పడి నేను వూరు చేరాను. నాకు బాగా తెలుసు. ఉష నన్ను తప్ప మరెవ్వరిని వివాహం చేసుకోదని, ఆమె బాధ పడ్తున్నట్టు వుత్తరం వ్రాసింది. నేను దాదాపు అదే పరిస్థితులతోనే యున్నాను. కాని నేనేమి చేయుడానికి శక్తి లేదు. కోటికి పడగలెత్తిన మిల్లు యజమాని కుమార్తైను కనీసం స్మరించటానికి గూడ నాకు హక్కులేక పోయింది,

కాని ఉషను మరచిపోదామని చేసిన ప్రయత్నాలన్ని వ్యర్థమైనాయి. ఆమెను నా మన: ఫలకం నుండి తుడిచివేయలేకపోయా, రోజుకు రోజు ఈబాధ మరీ హెచ్చింది. నేను క్రమంగా మానసికాదోంళన ంది నా ఆరోగ్యాని పోగొట్టుకొన్నా. ఈస్థితిలో నాపై పిడుగు పడ్డట్టు ఉష వివాహం ఒక ఇంజనీరుతో నిశ్చయమైందని వార్త అందింది, నానవనాడులు కృంగనాంభించింది. నాకేంచేయడానికి తోచడంలేదు ఈ విషమ పరిస్థితి నర్థంచేసుకొని మా వాళ్ళు నాకు వివాహం చేయ నిశ్చయించి నా సలహా కోరారు. నేను సుతారాం ఇష్టపడలేదు. అమ్మానాన్న బ్రతిమాలి చివరకు సంబంధం నిశ్చయం చేశారు. నేను జీవచ్ఛవంలా పెండ్లి పందిరిలోకూర్చొని లేచాను.

నాభార్య సుధ నిజంగా అందమైంది. ఉష కంటె ఏన్నోరెట్లు గొప్పగుణాలు కలదిగా తోచింది. కేవలం స్కూలు చదువు వరకే చదివినా అన్నీ విషయాలు అత్యేతుణంగా తెలుసుకుంటూ నా బాధను అర్థం చేసుకుంది సుధతో వున్నంత కాలం నేను నా బాధ నంతటిని మరచిపోగల్గుతున్నా. కాని ఎంత ప్రయత్నించినా నేనెందుకో సుధను ప్రేమించలేకపోతున్నా మళ్ళీ అనురాగం మాత్రం పెల్లుబికివస్తుంది. ఆమెను చూస్తుంటే నేనేదో తప్పు చేసిన వాడిలా బాధ పడ సాగా. ఇప్పుడు నా మట్టుకు నేను కులాసాగా తిరుగుతున్నాను. అంతా సుధ చేతి చలవ.

ఉద్యోగ ప్రయత్నంలో పడ్డా మళ్ళీ. వుద్యోగం ఏమన్నా బజారులో దొరికే వస్తువా? ఎక్కే గడపా దిగే గడపపా వున్నదే తప్ప, ప్రయత్నానికి తగిన అనుకూల ఫలితం, పరిస్థితు లేర్పడుతుందనీ, ఎవరు మాత్రం నిశ్చయించగలరు. ఇంట్లో అందరికి నేను చాల చులకనయిపోయాను. ఈ పరిస్థితి నుండి తప్పించుకొందామని పారిపోనుద్దేశించా పిరికి పంద లాగా. నన్నే నమ్ముకొన్న సుధ గతి ఏంకాను. ఇప్పుడు సుధ గర్భవతి. ఆమెను ఆ పరిస్థితిలో వదలి పోవడం శోచనీయం. రోజు రోజుకు ఇంట్లో పరిస్థితుల ప్రభావం హెచ్చింది. ఆబాధకు తట్టుకోలేక పోతున్నా సుధ మాత్రం నాబాధను అర్థం చేసుకుంటూ నన్ను ఓదార్చుతుంది. అస్థితిలో సుధ లేకుంటే నేనేమి కాను. ఇలా ఎంతకాలం ఒకరిపై ఆదారపడి. వాళ్ళకు భారంగా, జీవితం గడపడం అని మథన పడసాగా.

# అసమర్థ



ఓరోజు వున్నట్టుండి. ఉష వద్దనుండి వుత్తరం వచ్చింది. కొన్ని అనివార్యకారణాల వల్ల తన వివాహం నిల్చిపోయిందని, తన్నొక్కసారి వచ్చి చూచిపొమ్మని వేడుకుంది. మళ్ళీ వెనుకటి రోజులు నా ముందు సినిమా రీలు లాగా తిరిగింది. నేను అవసరపడి ఇలా మారిపోయానని అనుకుంటుందేమో. నేను ప్రేమించడం లేదని భావిస్తుందేమో. ఎందుకైనా మంచిది, ఉషను ఒక్కసారి వెళ్లి చూచి, పరిస్థితులను విశదీకరించి రావచ్చుననుకొని బయల్దేరా. సుధను విడిచేపెట్టి వెళ్లిపోతున్నానని బాధగా చూచింది-ఆమెను ధైర్యంగా యుండమని, వుద్యోగం దొరికిన తక్షణం తీసుకుని వెళ్లిపోతానని హామీ ఇచ్చి మరి బయల్దేరా.

ప్రయాణం చేస్తున్నానన్న మాటేకాని, ఉషను ఏలాసముదాయించడమా అనియోచిస్తూ కూర్చున్నా. ఉష నన్ను స్టేషన్లోనే ఆహ్వానించి తీసుకెళ్లింది. వాళ్ళ నాన్నను చూడ్డంతోనే మళ్ళీ పాత పరాభవం నా స్మృతిపథానికొచ్చింది. నేనెక్కడ మళ్లీ అవమానించబడ్తానో అనియోచించా. కాని అలాంటిదేమీ జరుగలేదు. అయనకులాసాగా మాట్లాడ్తు, నన్ను వుత్సాహపరచి చూచాడు. నాకు మరీ వింతగా తోచింది అతని ప్రవర్తన, తర్వాత తీరిగ్గా మాట్లాడుతు, నేను పడుతున్న కష్టాలన్నిటిని తాను ప్రత్యక్షంగా చూడకపోయినా, పరోక్షంగా వింటూన్నానని, తాను చాల బాధ పడుతున్నానని మొసలి కన్నీరు కార్చాడు. అంతగా నా కభ్యంతరం లేకపోతే తన మిల్లుతోనే మేనేజరుగా వుద్యోగం ఇప్పిస్తానని చెప్పాడు. ఇప్పుడున్న పరిస్థితులలో నాకింతకంటె మంచి అవకాశం దొరకదు. సరేనన్నా, కానీ ఆయన మళ్ళీ ఓ షరతువెట్టాడు. నేను ఉషను వివాహం చేసుకోవాలట. అంతగా పరిణమిస్తే తాను జీవితాంతం సుధను కాపాడ్తనని, తన కుమార్తెను యేలుకోవలసిందిగాకోరాడు. ఈ మాటలు వింటూ నేను అచేతనుడినిఅయి నిల్చిపోయాను, నా కాళ్ళ క్రింద భూమి తిరుగుతున్నట్ల నిపించింది. నాకు యోచించడానికి అవకాశం కావలయునని కోరి సెలవు తీసుకొని వెళ్లిపోయా. నా మనస్సు మనస్సులో లేదు. నా సౌఖ్యానికై ఏపాపం ఎరుగని సుధ బలి కావలసిందేనా! సుధ మీద జాలి కల్గుతుంది కాని ప్రేమించ లేకపోతున్నా. వెంటనే బయల్దేరి రమ్మని, నాకు వుద్యోగం దొరి

సుధ ... కున్నట్టుగా ... దేరి వచ్చింది ... ను పరిచ... డంతో, చకితురాలై ... స సుధ తానే జోక్యం కల్పించుకొని పరిస్థితినంతా ఆమూలాగ్రంగా విశదీకరించింది. ఇప్పుడు ఉష నన్ను అపార్థం చేసుకోలేదు సరి కదా ద్విగుణీ కృత వుత్సాహంతో సుధను తన అక్కయ్యగా భావించి ఆహ్వానించింది. కాని వాళ్ళిద్దరు అలా అన్యోన్యంగా వుండడంలో నేను ఏదో పోగొట్టుకుంటున్న వాడిలా ఫీలవసాగాను.

మళ్లీ ఆలోచనలో పడ్డాను, ఏలా ఈ పరిస్థితినుండి బయట పడడమా అని యోచించసాగా, ఏ నిర్ణయం చేయలేకపోయా.

ఆ రోజు దీపావళి పండుగ ఇల్లంతా కళకళ లాడుతూ ఆనంద దాయకంగా వుంది. సాయంత్రం ఏదో పని వుండి సుధను పిల్చాను. ఉషతో మాట్లాడుతూ పరాకున నాపిలుపు విని పరుగెత్తి వస్తూ పొరబాటున కాలుజారి మిద్దె మెట్లనుండి దొర్లిపడిపోయింది. సుధను ఆస్పత్రిలో చేర్చడం తప్ప వేరుగతి లేకపోయింది. వేదననే వెదజల్లింది. డాక్టరు ఇక జీవించే ఆశలేదని చెప్పేసాడు. నేను పిచ్చివాడిలా ఇటునటు తిరుగుతున్నా. కొన్ని గంటల సేపు ఏడుస్తూ సుధ చెంత కూర్చుని పోయా. రెప్పలల మటిస్తున్న సుధ కను చూపుల భావాలు, మా ఇరువురి ఆత్మలను అర్థంకాని మాపుల్తో ఆహ్వానిస్తూ వేచియుండే ఆ కొద్ది గడియలు తనలో వూడిపడే యేవో భావాల్ని వెలిబుచ్చలేక మ్రింగలేక తికమక పడటం బాగా అర్థం చేసుకున్నాం. ఆమె చూపుల్లో తీరని శాంతి కలలు తేజరించు నట్లు, ఎందుకో మా ఇద్దరికేసి చూస్తూ కళ్ళు వాల్చింది. సుధ ప్రాణ వాయువులు అనంతంలో లీనమైపోయాయి. నేను భోరున పడి ఏడ్వసాగాను.

ఇప్పుడు నేను సుధని తల్చని నిమిషమంటూ లేకపోయింది. బ్రతికినన్నాళ్లు నాకై, నా ప్రేమకై నా చిరు నవ్వుకై ఎదురుచూచింది.

ఇప్పుడు నేను చచిపోయిన సుధకై, నా ఆత్మా శాంతికై, నా పాపానికి పరిహారంగా, ఎదురు చూస్తున్నా! నాకు ప్రపంచ మంతా అంధకారంగా వుంది.



# DHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of October, '59.

**OUT-PATIENT REGISTER**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 43 |
| ,, ,, Medical ,, ,, | 981 |
| ,, ,, Gyneac ,, ,, | 146 |
| ,, ,, Ante-natal ,, ,, | 230 |
| ,, ,, Post-natal ,, ,, | 78 |
| ,, ,, Dental ,, ,, | 13 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 66 |
| Total Number of New Patients | 1,557 |
| Total Number of Old Patients | 2,385 |
| Grand total | 3,942 |

**ADMISSION REGISTER**

| | |
|---|---|
| No. of Normal deliveries | 157 |
| ,, ,, Abnormal deliveries (Forceps 5) | 5 |
| ,, ,, Antenatal cases with False Pains | 26 |
| ,, ,, Antenatal cases with Texeamia | 7 |
| ,, ,, Post-natal cases | 3 |
| ,, ,, Gyneac ,, | 33 |
| ,, ,, Medical ,, | 114 |
| ,, ,, Babies admitted as Lodgers | 172 |
| Grand total | 517 |

(Sd.) Dr. K. R. AMBUJA,
*R. M. O.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd.) Smt. V. LAKSHMI PARVATHI,
*Secretary.*

కు తంతి ఇచ్చి అగ

బయలు

## ంటికి యింపుఅయిన రంగవల్లులు :

# ఇంటికి శోభ

ప్రతీ స్త్రీకీ తన యింటి అందాన్ని గురించీ, ఇంట్లో అందమైనవీ, విశేషకరమైన వస్తువులు వాటిని గురించీ చెప్పుకొనుట అలవాటు తన యింటి సంగతులు విని ఎదుటి స్త్రీ తననీ తన పనులనీ ఇంటి విషయాన్నీ ప్రశంసిస్తే చాలా ఆనందం పొందుతూ ఉంటుంది. అలాగే నాకు కూడా మాయింటి విశేషాలనీ-గొప్పతనాన్నీ చెప్పుకుంటే తృప్తి కలుగుతుంది. ఉత్సాహం కలుగుతుంది. వినే వారికి తమ యిల్లు కూడా ఇల్లా ఉంటే బాగుంటుందని అనిపించాలని నా అభిలాష.

నాకెప్పుడూ కూడా "మా యిల్లు ఇంత పెద్దది. ఎంతో బాగుంటునది. ఎవరు ఎల్లా ఉంటారు" ఇవన్నీ చెప్పడం అలవాటు లేదు. నాకెప్పుడూ కూడా రోజూ ఇంట్లో ఏమేమిచేస్తామో, ఏమేమి తింటామో, ఎల్లా పండుకుంటామో ఇలాంటి మాటలు ఎవరితోటీ చెప్పుట అలవాటులేదు. కాని మా యింటిని ఏలా అలంకరిస్తానో ఏ విధంగా అందంగా ఉండడానికి ప్రయత్నిస్తానో ఇవన్నీ చెప్పడానికి నాకెంతో గర్వంగా ఉంటుంది

అయితే ఇప్పుడు చెప్పుతున్నాను– వినండి. మా యింటి శోభ దేని వల్ల కలుగుతుందో వివరంగా.

ప్రతి రోజూ ఉదయాన్నే మేము మా యింటి ముంగిట 'రంగోలీ'ని పెట్టుకుంటాము. వాకిలి శుభ్రముగా గోమయముతో నున్నగా అలికి దానిమీద చేతితో జేగురు పిండితో అందమైన ముగ్గులు అలంకరించుతాము దీనినేమేం 'రంగోలీ' అంటాము.

తులసికోట ముందర, దేవుని పీఠము ముందర, రంగోలీ పెడతాము, ఈ రంగోలీ అనేక రకములైనవి పెట్టవచ్చును. కాని ఇలాగ పవిత్రమైన స్థలములందు మాత్రం ప్రత్యేకించి 'గోపద్మ' స్వస్తి పూల్, చాందినీ, కాసవ్, అను వాటినే చిత్రిసాము. ఈ రంగోలీ చిత్రణ ప్రత్యేకంగా ఆలోచించి నిర్ణయింప బడినదిగా తోస్తుంది. 'ఫూల్' ఇంటికి సువాసన నిస్తాయి. దేవతా పూజా ద్రవ్యములు వెన్నెల మించిన వెలుగు నిస్తాయి, 'గోపద్మ' అనునది ఇంటిని పవిత్రం చేస్తుంది. మనకి గోవు పూజనీయ మగుటచే ఇదియు పవిత్రమే. 'స్వస్తిక' మన ధర్మ చిహ్నం. ప్రతీ శుభ కార్యమునందు దీనిని చిత్రిస్తారు, ఈ 'స్వస్తిక' సూర్య దేవునికి ప్రీతి కరమైనది శుభ కార్యములకు ఆకరము. జీవనమునకు ఆనందము. 'కాసవ్' కూడ పవిత్రమైనది దీనిని మనము ద్వారపాలకుంటాము. ఇదే ఇంటికి రక్షణ నిస్తుందనిమగవారి భావన.

అప్పుడప్పుడు మన యింటికి మంచి అతిథులు వచ్చిన మనము ఆ రోజుల నెంతో సుదినములని చెప్పుకుంటాము, అలాగే మాకు ఒక రోజు పండుగ వస్తుంది చాలా హడావిడిగా దానిని మరాఠీలో 'సమవార్' అంటారు.

శ్రావణమాసము వచ్చినప్పుడు మాకు ఆనందము కలుగుతుంది. శ్రావణమాసమును, ఋతురాజులలోకి శ్రేష్టమాసమని కూడ అంటారు. ఈ నెలలోనే "నాగపంచమి" వస్తుంది. ఈ రోజున మేం నాగదేవునిపూజ చేసుకుంటాము. ఆ రోజున ప్రతి యింటిలోనూ నాగదేవునిపూజ జరుపుకుంటారు. నాగదేవునిలో ఐక్యమయి మా పూర్వులందరు యిళ్లకు వస్తారని ప్రజల్లో ఒక నమ్మకము. పూర్వీకులైన పితామహులు నాగదేవుని రూపముతో ఇంటిని రక్షించుతారని కూడ అంటారు. ఇందుకు ఆయనకి పాలు యిస్తారు. అంటికే

మూలం : డాక్టర్ సరోజినీబాబర్.

అనువాదం : కె. సీతాదేవి.

పిలుస్తారు. ముంగిట నాట్యము చేయమని ప్రార్థన కూడ చేస్తారు. పాములవాడు దానిని తీసుకొని రాగానే దానిమన్నన కోసం తన నాగస్వరం వినిపిస్తాడు. ప్రసన్నం చేస్తాడు. ఈ నాగనృత్యం చూడ్డానికెంతో అందంగా ఉంటుంది

"నాగపంచమి" తరువాత మాకు "మహాలక్ష్మి" ఇంటికి వస్తుంది. ఆదిగౌరిదేవియొక్క పవిత్రనామము ఆమె తన కుమారుడగు గణపతితో కూడ వస్తుంది. ఆమెని మేము. మాయింటిలక్ష్మి, "కన్యా" అని అనుకుంటాము. ఇందుచేత ఆమెని మేము సాటిలేని గౌరవమ్మతో చూస్తాము. ఇంట్లోనుండే అన్నిటికన్నా మంచి బట్టలు, నగలు, మంచి భక్ష్యములు ఆమెకే అర్పిస్తాము. ఇంట్లో ఆమెకుపూజ జరుగుతుంది. ఆమె యెదుట పాటలు, పాడుతాము, నృత్యముకూడ చేస్తాము. ఆమెని ప్రసన్నము చేసికొనుటకై సర్వవిధముల ప్రయత్నిస్తాము.

దీనితరువాత "దీపావళి" వస్తుంది. ఇంటింటా, ఎక్కడ చూచినా, ఈ రోజున మాయింటికి పాండవులు, ద్రౌపది వస్తారు మహా భారతములోని శ్రేష్ఠ పురుషులు వారిరాణీని. వారితోటే శ్రీ కృష్ణుడు, చెలికత్తెలువస్తారు. వారినేమేం "గోలక్ష్మి" అంటాము ఐతే వీటినన్నింనీ మేము గోమయంతో తయారుచేసి ప్రాంగణంలో ఉంచుతామన్నమాట. ప్రతిరోజూ వారికెదురుగా కొత్త కొత్తగా ప్రపంచంలోని చిత్రాలను తయారు చేస్తాము. "ఆట్ పాట్నగర్" యొక్క పూర్వకాలపు పనితనం చూపిస్తాము. పువ్వులతోటి ఇతర పూజాద్రవ్యాలతోటి. వాటికికూడా పూజ జరుగుతుంది. ఇప్పుడే మా పిల్లలు "కిల్లా"ని చేస్తారు. మట్టి, కాగితం, తీసుకొని అతివాస్తవికంగా క్రమగోల్పేలా కోట నిర్మాణంచేస్తారు. దీపాలతో శోభగా.

ఇల్లాగే మా యింటిశోభ ఓరోజుకన్న ఓరోజు అధికంగా ఉంటుంది.

ఇదింకా ముందు అభివృద్ధి పొందాలంటూ మాయింటి పెద్దదిక్కు రాత్రి కల పుచ్చుకొని వస్తూ హెచ్చరిస్తుంది. "ఇదిరా, ఇంటికి శోభా, అందమూను!" దీన్నింకా వృద్ధి చెయ్యండి. ఇదే ఇంటి సంస్కృతినీ, ఆచారాన్నీ చెపుతుంది. ఇదే మిమ్మల్ని తయారు చేస్తుంది, దీనివల్లే ప్రపంచం మిమ్మల్ని గుర్తిస్తుంది" అని.



# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తి కలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంచే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.




AL-57-1 TELUGU